# గినీ కోడికి మచ్చలు ఎలా వచ్చాయి





చాలా రోజుల నాటి సంగతి. అన్నీ అప్పుడప్పుడే కొత్తగా తయారయ్యాయి. ఆ రోజులలో గినీ కోడి ఈకలు నల్లగా మెరుస్తూ ఉండేవి. వాటి ఈకల మీద ఇప్పటిలాగా తెల్లటి మచ్చలు లేవు – అసలు ఒక్క మచ్చ కూడా లేదు.





గినీ కోడి చాలా చిన్నది, కానీ చాలా పెద్ద జంతువుతో దానికి స్నేహం. దాని స్నేహితురాలు ఒక ఆవు.



పెద్ద పెద్ద కొండల మీద తిరగటం ఆ రెండింటికీ ఇష్టం. అక్కడ ఆవు గడ్డి మేస్తూ ఉంటే, గినీ కోడి గింజలు, పురుగులు ఏరుకుని తినేది.







రెండూ కూడా సింహం వస్తుందేమోనని ఒక కన్ను వేసి ఉంచేవి.





ఒక రోజు ఒక కొండ మీద ఉన్న
ఆవు దగ్గరకి వాగు దాటి గినీ కోడి
వెళుతోంది. ఆ కొండ మీద గడ్డి
చాలా బాగుంది, ఆవు ఆబగా గడ్డిని
కొరికి తినటం గినీ కోడికి వినిపిస్తూ
ఉంది.



అంతలో...

ఆవు వైపుకి నక్కి నక్కి

వెళుతున్న దానిని గినీ కోడి

చూసింది.

అది సింహం కాదు కదా...?

అవును, అది సింహమే!

సింహాన్ని చిన్నదైన గినీ కోడి ఏమి చేస్తుందని మీరు అనుకోవచ్చు. కానీ, గినీ కోడి అలా అనుకోలేదు. అసలు అది ఏమీ ఆలోచించకుండా సాధ్యమైనంత వేగంగా వాగు ఒడ్డు నుంచి పరుగు తీసింది. దుమ్ములో రెక్కలు టపటపలాడిస్తూ, కాళ్లతో నేలను రక్కతూ వేగంగా ఆవుకీ, పులికీ మధ్యకి పరిగెత్తింది.



“గర్్రర్్రర్్రర్్రర్!” సింహం గర్జించింది.

“నా కళ్లల్లో ఇసక!  ఎవరు చేశారు?”







ధూళి మేఘం అణిగేపాటికి అక్కడ
ఎవ్వరూ లేరు- సింహం ఆహారం కూడా
మాయమయ్యిందని ప్రత్యేకంగా
చెప్పనవసరం లేదు.

ఖాళీ పొట్ట గుడగుడతో పాటు గుర్రు
గుర్ర్‌మంటూ సింహం కోపంగా దాని
గుహ వైపుకి వెళ్లిపోయింది.



రెండవ రోజు గడ్డి మైదానంలోకి గినీ కోడి ముందుగా చేరుకుంది. సింహం మళ్లీ దాడి చేస్తుందేమోనని అది ఎంతో అప్రమత్తంగా ఉందని మీకు తెలిసే ఉంటుంది.

కాసేపటికి, అంతే అప్రమత్తంగా వాగు దాటుతూ వస్తున్న ఆవు దానికి కనిపించింది. ఒక పొదలో మెల్లగా కదులుతున్న పసుపు పచ్చని తాడు లాంటిది గినీ కోడికి కనిపించింది. అది సింహం తోక కాదు కదా?





ఒక్కసారిగా గినీ కోడి దాని పొట్టి
రెక్కలతో సగం ఎగురుతూ, సగం
దొర్లుతూ ముందుకు దూకింది. దాగి
ఉన్న చోటు నుంచి సింహం ఉలిక్కిపడి
పైకి చూసింది.  ఫర్‌ర్‌ర్ర్ర... నల్లటి
సుడిగాలి గడ్డి మైదానం నుంచి వాగు
వైపుకి దూసుకుని వస్తోంది.
"క్లో-క్లో-క్లో!" అంటూ అది ఆవుని
హెచ్చరించింది.

"గినీ కోడి! నిన్నటి ఇసక తుఫానుకి కూడా కారణం ఇదే," పదునైన పళ్లు నూరుతూ అనుకుంది సింహం.

మరుక్షణం ఆ సుడిగాలి నీటిని తాకింది. "గర్్ళ్!" సింహం గర్జన కాస్తా నీటిలో మునిగిపోయింది.







“నోటికి అందిన ఆహారాన్ని పోగొట్టి నందుకు దానికి గుణపాఠం చెబుతాను!” అంటూ సింహం గర్జించటానికి ప్రయత్నించింది.




గరళ్



గళర్



గర్ర్ళ్




గర్ర్ర్ర్ర్ర్ర్ర్!

అది మళ్లీ గట్టిగా గర్జించగలిగేసరికి,



ఆవు, గినీ కోడి క్షేమంగా ఆవు
పాక దగ్గరకి చేరుకున్నాయి.



“గినీ కోడీ! సింహం నుంచి నన్ను రెండుసార్లు కాపాడావు. సింహం నుంచి తప్పించుకోటానికి ఇప్పుడు నీకు సహాయం చేస్తాను,” కృతజ్ఞతతో అంది ఆవు.

ఆవు తన తోక కుచ్చుని పాల కుండలో ముంచింది. తరవాత, పాలతో తడిసిన తోకని గినీ కోడి మెరిసే నల్లని ఈకల మీది విదిలించింది. గినీ కోడి ఈకల మీద తెల్లటి పాల చుక్కలు పడ్డాయి.



తన వంటి మీద ఉన్న అందమైన
తెల్లటి చుక్కలని గినీ కోడి మెడ
తిప్పి ఇష్టంగా చూసుకుంది.



గినీ కోడి తన రెక్కలను విప్పార్చింది.





వాటి మీద కూడా పాల చుక్కలను

ఆవు చిలకరించింది.



“క్లో-క్లో-క్లో! ఈ చుక్కలు చాలా బాగున్నాయి, ఆవు!”

గినీ కోడి సంతోషంగా నవ్వింది.

“ధన్యవాదాలు, ప్రియ మిత్రమా!” అని చెప్పి గినీ కోడి తన ఇంటికి బయలుదేరింది.



వాగు దగ్గరకి చేరుకునేసరికి దానికి

ఎవరు ఎదురయ్యారు?

సింహం. అది ఇంకా అక్కడే జూలులోని

నీళ్లు విదిలించుకుంటూ ఉంది.



“ఓ మచ్చల పిట్టా!”

ఇంకా కోపంగా ఉన్న సింహం

అడిగింది.

“నీకు గినీ కోడి ఏమైనా

ఎదురయ్యిందా?”



“ఆ, కనపడింది,” తన నవ్వుని ఆపుకుంటూ

గినీ కోడి చెప్పింది.

“అది ఆ వైపుకి వెళ్లినట్టు ఉంది.”

తన చుక్కల రెక్కను దూరాన ఉన్న

కొండలకేసి చూపిస్తూ చెప్పింది.

“విశ్రాంతి కోసం ఎక్కడా ఆగకుండా వేగంగా

వెళితే తొందరగానే దానిని

పట్టుకోగలుగుతావు.”



ఎప్పుడూ చూడని ఆ పక్షికి ధన్యవాదాలు కూడా చెప్పకుండా సింహం వెంటనే బయలు దేరింది.



ఆ పిట్టను గుటుక్కుమనిపిస్తే బాగుండేదని ఒక్క క్షణం తరవాత సింహానికి అనిపించింది.  కానీ అది వెనక్కి తిరిగి చూసేసరికి ఆ పిట్ట ఎక్కడా కనపడలేదు.



“గడ్డిలో, నీడలో దాక్కోటానికి ఈ

మచ్చలు బాగా పనికి వచ్చాయి!”

గినీ కోడి పెద్దగా నవ్వుకుంది.

సింహం మొదట చూసిన

చోటులోనే అది ఇంకా ఉంది.





తన స్నేహితురాలికి మరోసారి
కృతజ్ఞతలు తెలిపేందుకు ఆవు
ఇంటి వైపుకి గినీ కోడి మళ్లీ
బయలు దేరింది.



